# బ్రతుకు దెరువు.

(కథ)

తల్లాప్రగడ ప్ర. శాస్త్రిరాయుడు.

వెల :

[illegible] పై.

మిత్రులు శ్రీ చక్కా సత్యనారాయణరావు (నిడదవోలు)
దీని ముద్రణకైన ఖర్చంతా భరించి దీన్ని
ముద్రింపించారు.

శే. ప్ర.

నిడదవోలు :
మాలతీ ప్రెస్‌లో ముద్రింపబడినది.

ప్రబోధనాలు, ఆత్మ నిజయాలు—ముఖ్యంగా యివే టాల్స్టాయి కథకు కావలసిన సాధన సామగ్రి.

నిజమైన సుఖం, ఆనందం అనుభవించడానికి పాండిత్యంతో గాని, కులాధిక్యతతో గాని పనిలేదు. చెప్పులు కుట్టేవాడైనా సరే, నిష్కల్మషహృదయుడైతే, ఉత్తమమైన మానవ సేవా, తద్వారా ఈశ్వర సాక్షాత్కారమూ తప్పక లభిస్తాయని ఈ కథలో మాకు దొరికే పాఠం.

త. ప్ర.

# బ్రతుకు దెరువు.

——:O:——

"భగవనునిలోనే ప్రేమయొక్క వునికి. ఎవరు ప్రేమ సూత్రాన్ని సాధిస్తారో వారే భగవంతుని బిడ్డలు. వారు మాత్రమే ఆ యమృతుని తెలుసుకుంటారు. ప్రేమ విహీనుడు ఈశ్వరుని జాడే కనిపెట్టలేడు. ఎందుచేత? — ఈశ్వరుడే ప్రేమ కనుక."

◆ ◆ ◆ ◆

"తానొక ప్రక్క ఈశ్వరభక్తుణ్ణని చెప్పుకుంటూ, తోటి మానవునే గర్హించి బ్రతికేవాడు నికృష్టుడైన సత్యదూరుడు. కంటి యెదుట కనిపించే తోటి మనుష్యుణ్ణే ప్రేమించలేకపోతే, తా నెప్పుడూ చూడని ఈశ్వరుణ్ణెట్లా ప్రేమిస్తాడు?"



ఒక బీదవాడుండేవాడు. చెప్పులు కుట్టుకొని బ్రతికేవాడు. వానిపేరు సుదర్శనం. ఉండటాని కిల్లా వాకిలీ లేదు. పొలం అసలే లేదు. మరొక పేద గృహస్థుని యింట్లో ఒక మూల భార్యాబిడ్డలతో కాపుర మున్నాడు. పనివల్ల వచ్చే కొద్ది కూలితో ఏ పూట కాపూట గడిచిపోతూండేది. ఆదినాలలో కూలీలు చవక, తిండి ప్రియం. సుదర్శనం సంపాదన కాస్తా తిండికే సరిపోయేది. ఇక దుస్తుల కోసం యెప్పటి

కప్పుడే యిచ్చింది. చలికాలాని కుపయోగపడే గట్టి గుడ్డ (దుప్పటి) యింటికల్లా ఒక్కటే వున్నది. అది కూడా పాత దయింది. ఎట్లాగో కొంచెం డబ్బు కూడబెట్టి, రెండు ఉన్ని కంబళ్లు కొందామని రెండేళ్లనుంచి ప్రయత్నిస్తూన్నా సాధ్యం కాలేదు. బహు కష్టం మీద మూడు రూపాయలు కూడబెట్టినాడు. సుదర్శనం భార్య నలిని ఆ మూడు రూపాయలూ తన పెట్టెలో దాచి వుంచింది. మరి రెండు రూపాయలవరకూ గ్రామంలో రావలసిన బాకీలున్నాయి. అదీ యిదీ కలిపి కంబళ్లు కొనడానికి సుదర్శనం ఒకనాడు ఉదయాన్నే ఊళ్లోకి బయలుదేరినాడు. తన చొక్కా ఒకటి, దానిమీద భార్య చొక్కా ఒకటి, పైన ఒక గుడ్డకోటూ వేసుకున్నాడు. చద్ది అన్నం తిని, భార్య వద్దనున్న డబ్బు జేబులో పెట్టుకొని బయలుదేరినాడు. ఊళ్లోవి రెండు రూపాయలూ కలిసివస్తే మంచి కంబళ్లు వస్తా యనుకుంటూ పోయినాడు.

ఊళ్ళోకి వెళ్లి, ఒక బాకీదారుని యింటివద్ద తలుపు తట్టి పిలిచాడు. గృహస్థు ఇంటివద్ద లేడు. వారం దినాలు పోయినాక గాని డబ్బు దొరకదని చెప్పి పొమ్మన్నది వాని భార్య. అక్కడ నుంచి మరొకని యింటికి పోయినాడు సుదర్శనం. డబ్బేమీ లేదని ఒట్టుపెట్టుకున్నా డాయింటి యజమాని; కొంచెం చిల్లరి మాత్ర మున్నది, కావలిస్తే యిస్తానన్నాడు. సుదర్శనం నిరాశజెంది బజారుకు పోయినాడు. పోనీ వర్తకుడైనా కావలిసిన చర్మం అరువిస్తాడేమోననే ఆశతో వెళ్లినాడు. "ముందు

డబ్బు చేతిలోబెట్టి నీ యిష్టంవచ్చిన వస్తువు తీసికోవచ్చు. తీరా అరువిచ్చి తరువాత డబ్బుకోసం నీ చుట్టూ యెవరు తిరుగుతారు?" అని చెప్పి వెళ్ళమన్నాడు వర్తకుడు.

సుదర్శనం బజారుకు వచ్చి చేసిన పనే కనిపించలేదు. రెండవ ఆసామీవద్ద దొరికిన మూడణాల చిల్లర, మరొక యింటివాళ్లు మరమ్మత్తుకోసం యిచ్చిన పాత జోడొకటీ—ఇంతే ఆనాటికి కలిగిన ఫలితం.

సుదర్శనం మనస్సు కుంగిపోయింది. పైగా దొరికిన మూడణాలూ ఖర్చుపెట్టి సారాయి తాగి కొంత ఆకలిబాధ తీర్చుకొని తిరిగి యింటికి బయలుదేరినాడు. ఆనాడు విపరీతమైన మంచు కురిసి, తరువాత చలిగాలి ప్రారంభమయింది. కాని సారా మైకంలో సుదర్శనానికి చలే అనిపించలేదు. చేతికర్రటకు టకు మని నేలకు తట్టుతూ, హుషారుగా తనలో తాను మాట్లాడుకుంటూ, నడిచిపోతున్నాడు. "దుప్పటి లేకపోయినా వెచ్చగానే వుంది. హాయి హాయ్, బలే బాగున్నది! ఉన్ని కంబళ్లతో యిక నాకేం పని? లేకుండానే బ్రతకవచ్చు. కాని యింటివద్ద నా భార్య మాత్రం గగ్గోలు చేస్తుంది తప్పదు... ......నిజమే, మరి! దినమంతా రెక్కలు విరిగేటట్లు పని చేయించుకొనడం, ఇయ్యవలసిన డబ్బియ్యకపోవడం—సిగ్గు లేదూ—సరే వుండు! బాకీ యియ్యమంటే మూడణాలు పారవేస్తావా? మూడణాలతో నేనేం జేసుకునేది? తీసుకు వెళ్లి కల్లు అంగడి కియ్యాలి—అంతే. మరెందుకూ కొరగాదు.

కదా! ఇబ్బందిగా వున్నదని సాకు జెప్పి ఎగవేస్తావా? ఉండ వచ్చు—మరి నా యిబ్బం దెట్లా గడవాలి? నీ కిళ్లూ వాకిలీ, పాడీపంటా వున్నాయి. మా కేముంది? ఒక అయ్యా ధర్మాన్ని పొరుగింట తలదాచుకుంటున్నామే! ఏది ఏమైనా తిండి తప్పదు కదా! ఇప్పుడు నే నింటికి చేరేసరికి ఇంట్లో తినడానికి కేమైనా వున్నదో లేదో దేవు డెరుగును. నీ వియ్యావలసిం దేదో వెంటనే యివతల పడెయ్యి. నీ మాటలు నా వద్ద సాగవు!"

ఇట్లనుకుంటూ సుదర్శనం రోడ్డుమూలనున్న దేవాలయం సమీపించాడు. తలయెత్తి చూచాడు. మండపం వెనుక నేదో తెల్లగా కనిపించింది. అప్పుడే కనుచీకటి పడుతున్నది. ఆ తెల్లని వస్తువేమో సుదర్శనం పోల్చలేక పోయినాడు. "అక్క డెప్పుడూ తెల్లనిరాయి వుండినట్లు తోచదే!—తెల్లని యెద్దా?—ఎద్దులాగునా లేదు! మనిషి తల లాగునే కనిపిస్తున్నది. అంత తెల్లగా వున్నదేమో! అయితే వాని కిప్పు డిక్క డేమి పని వుంటుంది?" అని సందేహంలో పడ్డాడు.

మరికొంత దగ్గరకు వచ్చి చూచాడు— నిజంగా మనిషే! బ్రతికున్నాడో లేదో మాత్రం తెలియలేదు. అంత చలనం లేకుండా పడివున్నా డావ్యక్తి. ఒంటిమీద బట్టలేదు. శరీరం గోడకు జేరగిలబడి వున్నది. సుదర్శనానికి ఒళ్లు కంపించి భయం పుట్టింది. "వీ డెవరో కదా! చంపి దిగంబరిగా ఇక్కడ విడిచి పోయినారు కాబోలు! దగ్గరకు పోతే దీనితో నా పుట్టిమి

మునుగుతుందో!" అనుకుంటూ, ఏమీ యెరగనట్లు సుదర్శనం వడివడిగా ముందుకు సాగిపోయినాడు.

కొంతదూరం పోయి వెనుక తిరిగి చూచాడు. గోడకు చేరి పడివున్న మనిషి ఇప్పుడు లేచి, అటుయిటు తిరుగుతూన్నట్లు కనిపించాడు. పైగా సుదర్శనం వంకే చూస్తూన్నట్లుకూడా కనిపించాడు. సుదర్శనం భయం మరింత హెచ్చయింది. "తిరిగి వెనకకు వెళ్లనా, నా దారిని నేను పోనా? దగ్గరకు వెళితే ఏం ప్రమాదం రాగలదోయేమో! ఏమో, వాడెటువంటి వాడో యేమి తెలుస్తుంది? వాడిప్పుడిక్కడ కేమీ సదుద్దేశంతో మాత్రం వచ్చివుండడు. ఒకవేళ దిక్కులేని దీనుడే అయితే, వాణ్ణికూడ యింట్లో పెట్టుకొని నేనే పోషించవలసి వస్తుంది. ఒంటిమీద గోచిపాతైనా లేదే! వాణ్ణింటికి తీసుకొని పోయి నేనేమి చేసేది? నాకున్న చింకిగుడ్డలు రెండూ వానికిచ్చివేస్తే ఆపైన నా బ్రతుకెట్లా? నా కెందుకు, దేవుడా, వీని గొడవ—నేను పోతాను" అని సుదర్శనం నిశ్చయం చేసుకొని తిరిగి దారిపట్టాడు.

నాలుగడుగులు వేశాడే కాని అంతరాత్మ పోనియ్యలేదు. హృదయాన్ని కలవరపెట్టి, ఇకముందుకు సాగనియ్యకుండా మనిషిని నిలిపివేసింది. "ఓహో సుదర్శనం, ఏమి చేస్తున్నావు? వాడెంత లేమిచే బాధపడుతున్నాడో నీ వేమెరుగుదువు? పిరికిపందవై యేమీ యెరగనట్లు పారిపోతున్నావుగా! దొంగలంటేనే భయం కలిగేటంత ధనికుడవైనావు. కాబో

లునే నీవు! ఛీ ఛీ!" అన్నట్లుగా లోపలినుండి ఒక తీవ్రమైన మందలింపు వినబడ్డది. సుదర్శనం గిరుక్కున వెనకకు తిరిగినాడు. ఎక్కడా నిలవకుండా ఆలయంవద్దకువచ్చి చేరాడు.

## ౨

ఈసారి బాగా దగ్గరకు వెళ్లి, మనిషిని పరీక్షించి చూచాడు సుదర్శనం. వాడొక యువకుడు. ఒంటిపైన దెబ్బలు కాని, గాయాలు కాని లేవు. కాని చలిచేతనూ, యేదో చెప్పరాని భయంచేతనూ కాబోలు, గజగజ వణుకుతున్నాడు. గోడకు ఆనుకొనే కూర్చున్నాడు. కండ్లు విప్పడానికి శక్తైనా లేనట్లు కనబడ్డాడు. సుదర్శన మింకా దగ్గరకు చేరి పలకరించాడు. అప్పుడే నిద్రనుండి లేచినట్లు కండ్లు విప్పినాడు. ఆ వొక్క చూపుతో సుదర్శనంయొక్క హృదయం కరిగిపోయింది. వెనుకటి సందేహాలూ భయమూ అంతరించాయి. మితిలేని జాలి, ప్రేమ అంకురించాయి. చేతనున్న పాతచెప్పుల జత కిందబెట్టి, తాను తొడుగుకున్న కోటు విప్పినాడు.

"అబ్బాయీ, మాటలకు సమయం కాదిది. లే, లే— ఈ కోటు వేసుకో" మంటూ జబ్బలు పట్టుకొని మనిషిని లేవదీసి నిలబెట్టినాడు. తరువాత వాని నఖశిఖపర్యంతం చూచాడు సుదర్శనం. శరీరంమీద అపరిశుభ్రత కాని, అంగవైకల్యంగాని యెక్కడా కనిపించలేదు. వాని మంచితనం, దయార్ద్ర హృదయం

ముఖంలోనే ప్రతిబింబిస్తున్నాయి. సుదర్శనం విప్పిన కోటు తానే యువకునికి తొడిగి, కోటు కొనలు నడుముకు బిగించి కట్టినాడు. వానిని కూర్చోబెట్టి వెంట దెచ్చిన చెప్పులజోడు వాని పాదాలకు తగిలించాడు, "సరి, యిప్పుడు బాగున్నది. ఇక లే, తమ్ముడూ! లేచి కొంచెం పచారు చేయవోయి; కొంత చలైనా తీరుతుంది. నాతో యిప్పుడు నడిచి రాగలవా?" అన్నాడు సుదర్శనం.

ఈ మాటలు విని యువకుడు లేచి నిలబడ్డాడు. తెలుపరాని కృతజ్ఞతతో ఒక్కసారి సుదర్శనం వంక తేరిపారజూచాడు. కాని నోట మాట మాత్రం లేదు.

"మాటాడవేమిటి? ఈ చలిలో యిక నిక్కడుండలేము. లేచి రా, నాయనా, ఇంటికి పోదాము. ఇదిగో యీ కర్ర చేతబుచ్చుకో" అని హెచ్చరించాడు సుదర్శనం.

యువకుడు తనంతట తానే లేచి, ఏ మాత్రం వెనుకబడకుండా, సుదర్శనంతో కలిసి నడక సాగించాడు.

"మీదేవూరయ్యా?" అని ప్రశ్నించాడు సుదర్శనం.

"నాదీ ప్రాంతం కాద"న్నాడు యువకుడు,

"ఈవైపువాడవు కావని తెలుసునులే. సామాన్యంగా ఈ చుట్టుపట్లవాళ్ల నందరినీ నే నెరిగే వున్నాను. అయితే నీ వా గుడివద్దకు రావడ మెట్లా కలిగింది?"

"నేను చెప్పలేను."

"నీ కెవరివల్లనైనా బాధ కలిగిందా?"

“నన్నెవరూ బాధించలేరు. భగవంతుడే నాకీ శిక్ష విధించాడు.”

“అది సరే, దేవుడే కదా సమస్తాన్నీ శాసించేవాడు. అయినా మన ప్రయత్నంకూడా వున్నది కదా! తినడాన్ని కేదో యింత తిండీ; తలదాచుకొనడాని కెక్కడో యింత చోటు మనమే చూచుకోవాలి. నీ వెక్కడి కని యిట్లా బయలు దేరినావు?”

“నా కెక్కడైనా ఒకటే.”

ఈ జవాబులు విన్ని సుదర్శనానికి అమితాశ్చర్యం కలిగింది. వాని మాటొక్కటీ అతని కర్థం కాలేదు. మనిషిలో చెడ్డ తనమూ కనిపించదు. నెమ్మదిగా, అతి మర్యాదగా మాట్లాడు తున్నాడు కాని తన్నుగూర్చి ఒక్కమాటైనా బయల్పడటం లేదు. “ఏమో, ఎవరికి తెలుస్తుంది, పాపం! ఏమి జరిగిందో అంటూ తనలో తానే సమాధానం చెప్పుకుని సుదర్శనం యువ కునితో యిట్లన్నాడు. “సరే, ఏమైతే నేమి లే. ఇంటికి చేరి కొంతసేపు పొయ్యివద్ద కూర్చుని చలైనా తీర్చుకుందాము. అబ్బా, ఏమీ చలిబాధ!”

సుదర్శనం వడిగా నడక సాగించాడు. యువకుడు కూడా వడి హెచ్చించాడు. చలిగాలి బాగా వీచటం ఆరంభించింది. సుదర్శనం ఒంటిమీద ఒక చొక్కా మాత్రం మిగిలింది. సారా మైకం తగ్గడంతోనే చలి యెక్కువయింది. ఆ చొక్కాయే ఒంటిచుట్టూ గట్టిగా బిగించి పట్టుకొని నడుస్తూ తనలో తా

ననుకుంటాడు: "అబ్బా, తిరిగి జ్ఞాపకం వస్తున్నది కంబళ్ల సంగతి. దానికోసమే కదా బజారుకు పోతిని: పైనున్న కోటొకటీ దానంచేసి వస్తున్నాను. ఇదిగాక ఒక కటిక దరిద్రుణ్ణి కూడా వెంట దీసుకొని వస్తున్నాను నళినికి యిదేమాత్రం యిష్టముండదు." ఇంటివద్ద భార్యను తలుచుకునేసరికి సుదర్శనానికి చాల విచారం కలిగింది. కాని తన వెంటనున్న మనిషి మాట తలుచుకుంటూ, గుడివద్ద ఆ దీనుడు చూచిన చూపును జ్ఞప్తికి తెచ్చుకుంటే, హృదయం ఆనందంతో పొంగిపోయింది.

## ౩

ఆ పూట సుదర్శనం భార్య గృహకృత్యాలన్నీ పొద్దుండగానే పూర్తిచేసుకున్నది. పిల్లల కన్నంపెట్టి, తాను కూడ తిని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నది. "ఈ పూట వండిన వంటకం యింకా కొంత మిగిలివుంది. సుదర్శనం వూళ్ళోనే భోజనం చేసి వస్తే ఇక రాత్రి భోజన మంతగా అక్కరుండదు. ఈ యన్నం రేపటికి పనికి వస్తుంది" అని యనుకుంటూ అన్నం కూర మూతపెట్టి, భర్త చొక్కా అతుకువేసి కుట్టడానికి బల్లవద్ద కూర్చున్నది. కుట్టుతూనే తనభర్త ఉన్నికంబళ్లెట్లా కొంటున్నాడో అనే ఆలోచనలో పడ్డది. "ఇతణ్ణి వర్తకుడేం మోసపుచ్చుతాడో పాపం! మంచివాడు, అమాయకుడు, చిన్నకుర్రవాడుకూడ ఇతన్ని సులభంగా మోసపుచ్చగలడు.

అయిదురూపాయలంటే మాటలా! అంతా ఖర్చుపెడితే మంచి రకం గుడ్డలు వస్తాయి. అబ్బా, పోయిన చలికాలంలో ఎంతైనా బాధపడ్డాము. ఏటినుంచి నీళ్లు తెచ్చుకొనడమే కష్టమైపోయేది. ఇంట్లోవున్న రెండుమూడు గుడ్డలూ ఉదయాన్ని ఆయనే వేసు కొని వెళ్లినాడు. అబ్బా, యిదేమి చలో!.........ఎంత పని వున్నా ఈపాటికి తప్పక తిరిగి రావలసిందే ఆయన. ఏమో పాపకర్మం—ఏమయిందో! సారా అంగడి కేం పోలేదు కదా దేవుడా!"

నలిని యిట్లనుకుంటూండగానే గుమ్మం బయట అడుగుల చప్పుడు వినబడ్డది. మరొక్క క్షణానికి తలుపు తెరుచుకొని, యెవరో లోపల ప్రవేశిస్తున్నారు. తాను కుట్టుతూన్న చొక్కాను కిటికీలో వుంచి, నలిని గుమ్మంలో కెదురుగా వెళ్ళింది. ఇద్దరు వ్యక్తు లప్పుడే లోపలికి వస్తున్నారు—సుదర్శనం, అతని వెంట ఒక పరాయి మనిషి.

మనిషియొక్క వెర్రివైఖరి, పైగా వానిని సుదర్శనం వెంట బెట్టుకొని రావడం చూచి, తన భర్త తప్పక సారాదుకాణం నుంచే వస్తున్నాడని నిశ్చయించుకున్న దామె. "అదిగో, తెలియదూ! ఆ ముఖాలే చెపుతున్నాయి!" అని సణుగుతున్నది. సుదర్శనం ఒంటిమీద కోటు లేదు. ఉన్ని దుప్పట్లు తెచ్చిన ట్లేమాత్రం కనిపించదు............సుదర్శనం లోలోపల సిగ్గుపడుతూ, వచ్చినవాడు వచ్చినట్లే నిశ్శబ్దంగా భార్య కెదురుగా నిలబడ్డాడు. నలిని ఆశాభంగానికి మితిలేకపోయింది.

"చేతికి దొరికినదంతా సారాదుకాణానికి పోసివచ్చాడు. తాను తాగి ఈ పనికిమాలిన వాణ్ణి చేత తాగించి వీణ్ణి వెంట దీసుకొని వచ్చాడు." అంటూ గట్టిగా మందలించడం మొదలుపెట్టింది.

కొంతవరకు కట్లా నిలబడి సుదర్శనమూ, కూడావచ్చినమనిషీ అక్కడనుంచి కదలి లోపలికి పోయినారు. నలినికూడ వాళ్ల వెనువెంటే లోపలికి వెళ్ళి నిలబడ్డది. కొత్త మనిషి యువకుడు. సన్నపాటి శరీరం. అతడు తొడుక్కున్న కోటు సుదర్శనానిదే. సుదర్శనంతో లోపలికి వచ్చి చలనం లేకుండా, కండ్లయినా విప్పకుండా నిలబడ్డాడు. "వీ డెవడో బహుదుర్మార్గుడై వుంటాడు—అంత దొంగభయ మెందుకో!" అంటూ నలిని కొరకొరలాడటం ప్రారంభించింది. పట్టరాని కోపం వచ్చింది. అయినా తరువాత వా ళ్లేమి చేస్తారో చూదామని పొయ్యి పక్కనే నిలబడ్డది.

తలమీద టోపీ తీసి కిందబెట్టినాడు సుదర్శనం. ఇంటి తాపత్రయం తన కేమాత్రం లేనట్లు నిర్విచారంగా బల్లమీద కూర్చుని "నలినీ, రా-రా! తినడాని కేదైనా వుంటే మాకు కొంచెం తీసుకొనిరా" అన్నాడు. నలిని జవాబు చెప్పకుండా పొయ్యివద్దనే నిలుచున్నది. ఒకసారి భర్తవంకనూ, మరొకసారి యువకుని వంకనూ తీవ్రంగా చూస్తూ, కోపంతో తల వూపడం మొదలుపెట్టింది. భార్యయొక్క విసుగుదలా, కోపం సుదర్శనం కనిపెట్టినాడు. కాని తన కావిషయంతో జోక్యం లేనట్లు నటిస్తూ "రా, నాయనా! కొంచె మేదైన తిని పడు

కుంటాము" అంటూ యువకుని చేయి పట్టుకున్నాడు. యువకుడు లేచి బెంచిమీద కూర్చున్నాడు.

"మా కేమీ లేనే లేదా యేమిటి? మాట్లాడవు!" అని సుదర్శనం భార్యను ప్రశ్నించాడు. కోపంతో నలిని ఒళ్లుడికిపోయింది. "ఆ, లేకనేమి—ఉంది, వుంది! అయితే నేను వండింది నీ కోసం కాదు. నీకు మతిపోయింది.— అంతవరకు నిజం. ఉన్నిబట్టల కోసం బయలుదేరిపోయి. ఉన్న కోటూ కోటీ ధర్మం చేసి, పైగా కట్టగుడ్డయినా లేని దౌర్భాగ్యుణ్ణొకణ్ణి వెంట దీసుకొచ్చావు. నీవంటి తాగుబోతులకు వండి వడ్డించడాని కేమీ లేదిక్కడ" అన్నది నలిని. "చాలు, చాలు! నోటికి వచ్చినట్లల్లా మాట్లాడకు. నెమ్మదిగా అడిగి చూడరాదూ? ఎటువంటివాడో—" అంటూ సుదర్శన మింకా యేదో చెప్పబోగా, భార్య అడ్డువచ్చి "పోనీ డబ్బెంతా ఏమయిందో చెపుతావా?" అని తీవ్రంగా మొనరుకున్నది. సుదర్శనం చొక్కా జేబు తడుముకొని మూడురూపాయలూ తీసి బల్లమీద పెట్టి "ఇదిగో డబ్బు! కోటయ్య ఇయ్యవలసిన బాకీ యియ్యలేదు. ఎప్పుడో యిస్తాడట" అన్నాడు. ఈ మాటతో నలినికి మరింత కోపం వచ్చింది. బల్లమీది డబ్బు తీసుకుంటూ మీ కీ రాత్రి భోజనం లేదు—ఎక్కడనుంచి వస్తుంది? ప్రతి దిగంబరినీ, దేశదిమ్మరినీ నేను పోషించలేను" అని నిష్కర్షగా చెప్పి వేసింది. "అదుగో, నలినీ, నీ ఆవేశం తగ్గించి, నేను చెప్పేదేమో కొంచెం వింటే—" అని భర్త చెప్పబోయేమాట

కడ్డంవచ్చి "ఔనౌను, వినకేమి, నీ మహోపదేశాలే వినాలి! నే నసలు నిన్ను పెండ్లాడటమే తప్పిదమైంది" అని బిగ్గరగా రోద చేయడం మొదలుపెట్టింది భార్య.

తనతో వచ్చిన మనిషి ఎక్కడ యే స్థితిలో కనిపించాడో భార్యకు నచ్చజెప్పాలని సుదర్శన మెంతైనా ప్రయత్నించాడు. కాని నలిని మాత్రం భర్తను నోరెత్తనియ్యలేదు. అత డొక మాట అనే లోపుగా, తా నతనిమీదికి పది మాటలు విసురుతూ, పదేళ్లనాటి పాత సంగతులన్నీ యేకరువుపెట్టి తిట్టడం మొదలుపెట్టింది. చివరకు మీదిమీదికి పోయి, సుదర్శనం తొడుక్కున్న చొక్కా పట్టుకొని లాగుతూ "ఏదీ, నా గొస్లా నా కియ్యి! నాకున్న దదొక్కటే. ఇస్తావా లేదా?" అన్నది. సుదర్శనం చొక్కా విప్పబోయినాడే కాని, భార్య మాత్రం తాను పట్టిన పట్టు వదలకుండా అటూ యిటూ గుంజటంలో చొక్కా చీరికలయింది. పిచ్చికోపం ఆపుకోలేక ఆ చింపిపాతే నెత్తిమీద వేసుకొని, నలిని వాకిటిగుమ్మంలోకి పోయింది. తలుపు తీసుకొని బయటికి పోయేదే; కాని మనస్థైర్యం లేక గుమ్మంలోనే నిలిచింది.

౪

నలిని గుమ్మంలోనుంచే కొత్త మనిషిని చూస్తూ "ఇత డెవరు? మంచివాడైతే యిటువంటి అవస్థ యెందుకు వస్తుంది? మంచివాడైతే ఇత డెవరో, యెక్కడ కనుపించాడో యింటికు

ముందే చెప్పివుంచావు" అని భర్తను తిరిగి తూలనాడటం ప్రారంభించింది. "అయ్యో, అది చెప్పడానికే కదా నేనింతవరకూ ప్రయత్నిస్తున్నాను! ఇతడు వడవడ వణుకుతూ రోడ్డు మూల ఆలయంవద్ద కనుపించాడు. నే నా సమయాని కక్కడ లేకపోతే ఇత డక్కడే ప్రాణం విడిచియుండును. అప్పుడు నేనేమి చేయవలసింది? దగ్గరకు పోయి పలకరించాను. కోటు తొడిగి నాతో తీసుకొనివచ్చాను. నలినీ, కోపపడకు; మనమందరమూ ఎప్పుడో చనిపోయేవాళ్లమే అని మాత్రం మరవకు" అని భర్త జవాబు చెప్పినా, నలినికి కోపం తగ్గలేదు. చెడ్డమాట లెన్నో అనేకసార్లు నోటి చివరకు వచ్చాయి, కాని ఎదుటి పరాయి మనిషిని చూచి కొంత తగ్గింది. యువకుడు బల్ల చివర కదలకుండా అట్లాగే కూర్చున్నాడు. కాళ్లుముడుచుకొని, మోకాళ్లమీద చేతులు కట్టుకొని, తలవాల్చి, కండ్లు మూసుకొని కూర్చున్నాడు. ఏదో పెద్ద మనోవ్యథలో పడి వున్నట్లు కనిపించాడు. నలిని రెప్పవాల్చక అతనివంకే చూడటం మొదలుపెట్టింది. అది కనిపెట్టి సుదర్శనం అంటాడు: "నలినీ మనలో భగవచ్చింతా, భూతదయా కొంత వుండవద్దా? నీలో మాత్రం భగవంతుడు లేడా? ఏమిటీ దురదృష్టం— ఈ యజ్ఞానం!"

సుదర్శనం మాటలు సమయ విశేషాన్నిబట్టి నలిని హృదయంలో అద్భుతంగా నాటుకున్నాయి. బల్ల చివర మౌనంగా కూర్చున్న మనిషిని చూస్తూండగానే ఆమెలో మార్పు కలి

గింది. గుమ్మంలో నిలబడ్డది తిరిగి లోపలికి వచ్చింది. పొయ్యి వద్ద దాచిపెట్టిన అన్నము కూర తెచ్చి యెదుటపెట్టి నిశ్శబ్దంగా పక్కనే నిలబడ్డది. "ఇట్లా కూర్చుందాము, రా నాయనా!" అని చెపుతూ సుదర్శనం అతిథి చేయి పట్టుకొని లేవదీశాడు. ఇద్దరూ కలిసి భోజనానికి కూర్చున్నారు. నలిని కూడా వచ్చి కొంచెం యెడంగా బల్ల చివర, గడ్డం చేతిమీద ఆనుకొని, వచ్చిన కొత్త మనిషిని ఏకదృష్టితో చూస్తూ కూర్చున్నది.

అతని దుస్థితి నలినికి అమితమైన జాలి గొల్పింది. పవిత్రమైన ప్రేమ, దయ ఆమె హృదయాన్నాక్రమించాయి.

ఆ క్షణంవరకూ ఖిన్నుడై కుంగిపోయి కూర్చున్న యువకుని ముఖం అప్పటికప్పుడే అద్భుతంగా విప్పారి మెరుపు తీగ లాగున ప్రకాశించింది. ఇప్పటివరకూ మనోవేదనతో ముడుచుకొనిపోయిన కనుబొమలు విప్పుకొని స్వర్గీయ సౌందర్యాన్ని వెలిబుచ్చాయి. యువకుడు కండ్లు విప్పి, నలినివంక తేరి పార జూచి, చిరునవ్వు నవ్వినాడు.

భోజనమైన తరువాత నలిని గిన్నెలూ పళ్లెం కడిగిపెట్టి స్థిమితంగా కూర్చుని "మీా దేవూరయ్యా?" అని అతిథిని కుశల ప్రశ్న వేసింది. తన దా ప్రాంతం కాదని యువకుడు జవాబిచ్చాడు. "మరి నీ వా రోడ్డుమీాద కెట్లా వచ్చావు?" అని తిరిగి నలిని ప్రశ్నించగా "నేను చెప్పలేను" అన్నాడు యువకుడు. "నీ వస్తువులన్నీ దొంగ లెత్తుకొనిపోయినారుకాబోలు,

పాపం !" అని నళిని విచారాన్ని వెలిబుచ్చింది. "నన్నెవరూ యేమీ చేయలేరు. భగవంతుడే నాకీ శిక్ష విధించాడు" అని యువకుడన్నాడు. "ఏమైతేనేమి, దిక్కులేని దిగంబరి వైనావు, పాపం !" అని జాలిపడ్డది నళిని. అప్పుడు యువకుడు కృతజ్ఞతతో యిట్లన్నాడు: "ఔనమ్మా, కట్టగుడ్డ లేకపోయింది. పైగా భరించరాని చలి. ఆ స్థితిలో నన్ను జూచి జాలిపడ్డాడు నీభర్త. ఇక్కడ నీవూ నా కన్నపానా లిచ్చి ఆదరించావు. భగవంతుడు నీ దయకు తగిన ప్రతిఫలాన్నిస్తాడమ్మా !"

నళిని లేచి వెళ్లి, కిటికీలోని పాత చొక్కా తెచ్చి వాని కిచ్చింది. మరొకచోటనుండి ఒక లాగుకూడా తెచ్చి యిస్తూ, "చలి, పాపం ! ఇది తొడుగుకొని మిద్దెమీదనో, కిందనో, నీ యిష్టమున్నచోట పడుకో" మని చెప్పింది. యువకుడు కోటు తీసివేసి, చొక్కా వేసుకొని, మిద్దెమీదికిపోయి పడుకున్నాడు.

నళిని పొయ్యి పక్కనే పడుకున్నది, కాని నిద్రపట్టలేదు. ఇంటికివచ్చిన మనిషినిగూర్చిన ఆలోచన పదేపదే మనస్సును కలవరపెడుతూనే వుంది. తమ దారిద్ర్యానికితోడు వీనిబాధ్యత కూడా పైబడ్డదనే చింత హెచ్చయింది. కాని అన్నం తింటూ అతడు నవ్విన చిరునవ్వు తలుచుకున్నపుడు ఆనందం కలిగేది. ఈ స్థితిలో నిద్రపట్టలేదని గ్రహించి అతణ్ణి పలకరించింది. "ఓయ్" అని పలికాడు సుదర్శనం. "రాత్రి మిగిలిన అన్నం మీ రిద్దరూ తిని వేశారు. రే పేమి కావలసిందో తెలియదు. అప్పుకోసం పొరుగింటికి పోవలసిందే" అన్నది నళిని. బ్రతి

కుంటే ఎప్పటి కప్పు డేదో సంప్రాప్తం కాకపోదులే" అని సుదర్శనం జవాబిచ్చాడు. నలిని కొంతసేపు ఊరుకొని "మనిషి మంచిగానే కనబడుతున్నాడు. కాని తా నెవర్తో మనతో సరిగా చెప్పడేమో!" నంటూ తిరిగి మాటలు ప్రారంభించింది. "చెప్పక పోతే మన కేమి? అతని యిష్టం. మన కెందు కా తొందర?" అన్నాడు సుదర్శనం. కొంతసేపుండి నలిని తిరిగి భర్తను పలకరించి యేదో అడగబోయింది. సుదర్శనం యిక జవాబులు చెప్పలేక, ఇక నిద్ర పొమ్మని భార్యతో చెప్పి తానూ నిద్రపోయినాడు.



మరునాడుదయాన్నే సుదర్శనం నిద్ర నుండి లేచాడు. పిల్లలింకా నిద్రపోతున్నారు. కొన్ని వస్తువులు జాగ్రత్తగా దాచమని చెప్పి నలిని పొరుగింటికి వెళ్లింది. యువకుడు కూడా అంతకు ముందే లేచి, కిందికి దిగివచ్చి, బెంచిమీద కూర్చున్నాడు. నలిని యిచ్చిన లాగూ చొక్కా తొడుక్కొని ఇంటి నడికప్పు వంక చూస్తూ కూర్చున్నాడు. కడచిన రాత్రివలె గాక అతని ముఖ మిప్పుడొక కొత్తకళతో నిండివుంది.

సుదర్శనం యువకుని సంబోధించి యిట్లన్నాడు: "మిత్రమా, పొట్టకు తిండి, ఒంటికి గుడ్డ ప్రతివానికీ కావలసిందే కదా! కనుక అందరూ ఏదో ఒక పని చేసుకొని స్వయంపోషణ చేసుకోవాలి, నీకేదైనా పని చేతనౌనా?"

తన కే పనీ తెలియ దన్నాడు యువకుడు. సుదర్శనాని కాశ్చర్యం తోచి, అసలు కుతూహల మొకటి వుంటే యేదైనా నేర్చుకోవచ్చు"నన్నాడు. "నిజమే, ప్రతిమానవుడూ ఏదో ఒక పనిచేస్తూ నేవుంటాడు. అట్లాగే నేనూ చేస్తాను" అని యువకుడు మాట యిచ్చాడు. "నీ పే రేమన్నాడు సుదర్శనం, "ప్రభాకరుడు" అన్నాడు అతిథి "సరే మంచిది, నీ పొట్టకు నీవే కష్టించి పనిచేసుకోవలెసుమా ! నేను చెప్పినట్లల్లా విని పనిచేస్తే, నీవు నాతోపాటు ఇక్కడనే వుండవచ్చు" అని సుదర్శనం ధైర్యం చెప్పినమీదట ప్రభాకరు డిట్లన్నాడు: "నీవు చూపిన దయకు భగవంతుడెంతైనా మెచ్చుకొని నీకు ప్రత్యుపకారం చేస్తాడు. నీవు చెప్పినట్లు విని, పని నేర్చుకుంటాను. న న్నే పని చేయమంటావో చెప్పు."

సుదర్శనం ఒక నూలు పిడి తెచ్చి, కొంతదారంతీసి, బొటన వేలికి పెనివేస్తూ, "చూడు, ఇదిగో—ఇది చాలా సులభమైన పనే" నన్నాడు. ప్రభాకరుడుకూడ వేలికి దారం చుట్టుకొని పెనివేయడ మెట్లాగో సుదర్శనం చేసి చూపించాడు. ఒకసారి చూడడంతో ప్రభాకరుడు ఆ పనికూడా చక్కగా చేయగలిగాడు.

ఈవిధంగా సుదర్శనం ఏపనిచేస్తే అదల్లా ప్రభాకరుడు అప్పటికప్పుడు తానూ చేసిచూపిస్తూ, మూడు దినాలుముగియకుండానే జోళ్లు కుట్టడంలో ఉత్తీర్ణుడైనాడు. చిన్నతనం నుంచీ

ఇదేవృత్తి కాబోలునన్నంత ఆరితేరిన పనివాడైనాడు. విసుగు విరామం లేకుండా దినమంతా పనిలోనే మునిగి వుండేవాడు. తినే ఆహారం బహు స్వల్పం. ఏరోజు కారోజు పని ముగియగానే, ఊర్ధ్వముఖుంగా చూస్తూ ఒకచోట నిశ్శబ్దంగా కూర్చునేవాడు. అత్యవసరమైనప్పుడు ఒకటి రెండు మాటలు మాట్లాడటం, మిగిలినప్పుడల్లా మౌనం. వీధిలో యెప్పుడూ అడుగు పెట్టి యెరుగడు. ఒకరిని యెగతాళి చేయడంగాని నవ్వడంగాని యెప్పుడూ లేదు. మొదటినాడు రాత్రి నళిని భోజనం పెట్టినప్పుడు తప్ప, తరువాత యెన్నడూ చిరునవ్వైనా వాళ్లు చూచి యెరగరు.

## ౬

ఇట్లా దినాలూ వారాలూ గడిచాయి, ఒక సంవత్సరం వెళ్లింది. ప్రభాకరుడు సుదర్శనంతోనే కలిసి పని చేస్తున్నాడు. ప్రభాకరుడు చాలా మంచిపనివాడని, చుట్టుపట్ల ఇంతటి పనివాడు మరొకడు లేడని చెప్పుకుంటున్నారు.

శీతకాలంలో ఒకనాడు సుదర్శనమూ ప్రభాకరుడూ జోళ్ల పని చేసుకుంటూవుండగా, గంట మోగిస్తూ ఒక గుఱ్ఱపుబండి వచ్చి సుదర్శనం యింటిముందు నిలిచింది. భార్యాభర్తలిద్దరూ కిటికీగుండా బయటికి తొంగి చూచారు. బండితోలేవాడు దిగి వచ్చి, బండి తలుపు తెరిచాడు. ఒక ఆసామీ బండిదిగి గుమ్మం వద్దకు వస్తున్నాడు. ఈలోగా నళిని వాకిటి తలుపు తెరిచింది.

వచ్చిన మనిషి బాగా పొడగరి. తలవంచి గుమ్మంలో దూరి, కొంత ప్రయాసతో లోపలికి వచ్చి, నిలువునా నిలబడే టప్ప టికి తల సుమారుగా ఇంటికప్పును తాకినట్లయింది. ఎర్రని ముఖం, బహుస్థూలశరీరం, గదిలో చాలాభాగం అతడే ఆక్రమించి నిలబడ్డాడు. సుదర్శనం లేచి తలవంచి, వచ్చిన ధనికునికి నమస్కరించి, నిర్వోరబోయి చూస్తున్నాడు. అంతటంత మనిషిని అదివరకెన్నడూ చూచియుండలేదు.

లోపలికి వచ్చి ధనికుడొక పెద్ద ఊపిరి విడిచి, తానూ తొడుక్కున్న ఉన్ని కోటు విప్పి, ఆయాసపడుతూ బెంచి మీద కూర్చున్నాడు. కుట్టుపనివాళ్ళవంక చూచి "ఇక్కడ మేస్త్రీ యెవరు?" అని యడిగాడు. "చిత్తం నేనే బాబూ!" అంటూ సుదర్శనం వంగి వందనం చేశాడు, ధనికుడు వాడితోటే కుర్ర వాణ్ణి పిలిచి "పట్టుకొని రా రా, చర్మం సంచీ!" అని యన గానే, చర్మం తీసుకొని సేవకుడు లోపలికి వచ్చాడు. దానికి కట్టివున్న దారం పిల్లవాని చేత విప్పించాడు ధనికుడు. సుదర్శ నాన్ని పిలిచి చర్మం చూపిస్తూ, "చూచావా? కదా, యీ చర్మం!" అన్నాడు. "అయ్యా, చిత్తం" అన్నాడు సుదర్శనం. "ఇది యేమి చర్మమో నీకు తెలుసునా?" అని ప్రశ్నించాడు ధని కుడు. "చర్మం మంచిదేనండయ్యా" అని దాన్ని చేతితో పట్టి చూస్తూ సుదర్శనం బదులు చెప్పినాడు. "మంచిదే నంటావా! అదెవరికి తెలియదు? అయితే నీ వింత మంచిచర్మం నీజన్మలో చూచి వుండ లేదన్నమాట! ఇది జర్మను చర్మం. ఇరవై

రూపాయలిచ్చి కొన్నాము - తెలిసిందా?" అన్నాడు ధని కుడు. సుదర్శనం ఆశ్చర్యంతో చర్మం వంక చూస్తూ, "అయ్యా, ఇంత మంచి చర్మాలు మీ రెట్లా చూడగలము బాబూ!" అన్నాడు. "సరే కాని దీనితో నాకు 'బూటు' కుట్టి యియ్యగలవా?" అని ప్రశ్నించాడు ధనికుడు. "చిత్తం, సెలవైతే కుట్టి యిస్తాము, స్వామీ!" అన్నాడు సుదర్శనం. అప్పుడు ధనికుడు బిగ్గరగా యిట్లన్నాడు: "చేయగల నంటు న్నావు, జాగ్రత! చర్మం విలువయేమో, ఎవరికి కుట్టబోతు న్నావో తెలుసుకొని మరీ చెప్పు. జోడు ఒక సంవత్సరానికి తరుగవ మన్నకూడదు, ఆకారం చెడకూడదు, కుట్లూడిపోకూ డదు, అట్లా చేయగలిగితేనే తీసుకో; లేకుంటే ముందే చెప్పు. సరిగా చేస్తే నీ కష్టానికి తగిన కూలి దొరుకుతుంది. లేకుంటే మాట దక్కదు— శిక్షకు పోతావు!"

ధనికుని షరతులు విని సుదర్శనానికి అధైర్యం పుట్టింది జవా బేమి చెపుతాడు? ప్రభాకరుని వంక చూస్తూ, "ఒప్పు కోనా, యీపని?" అన్నట్లు కనుసంజ్ఞ చేశాడు. "తప్పక తీసుకో!" మన్నట్లు ప్రభాకరుడు తల వూపాడు.

ప్రభాకరు డిచ్చిన ధైర్యంమీద సుదర్శనం చర్మం తీసు కున్నాడు.

ధనికుడు తన సేవక బాలునిచేత ఎడమకాలి పాదరక్ష విప్పించి, "ఇదిగో కాలికొలత—సరిగా తీసికో!" మన్నాడు. సుదర్శనం చేతులు శుభ్రంగా తుడుచుకొని, ధనికుని మేజో

క్కడ మలినపరుస్తానో అనే భయంతో, భక్తి వినయాలతో వంగి కొలత తీసుకున్నాడు. పదిహేడు అంగుళాల కాగితం ముక్క ఒకటి కత్తిరించి, దానితో పాదం కొలిచాడు. తిరిగి వేరువేరుగా మడమ, పిక్క కొలిచాడు. పిక్క దూలమంత లావున్నది. "జాగ్రత సుమా, పిక్క దగ్గర బిగువు చేసేవు ! సరిగా చూసుకో !" అని హెచ్చరించాడు ధనికుడు. ముందు చింపిన కాగితం చాలక, సుదర్శనం మరొక కాగితం కత్తిరించి, తిరిగి కొలత తీసుకున్నాడు.

సుదర్శనం కొలతలు తీసుకుంటూండగా ధనికుడు ఇంటి నాలుగు మూలలూ పరికించడం మొదలుపెట్టినాడు. ఒక మూల ప్రభాకరుడు కనబడుతున్నాడు. "ఆ మూల కూర్చున్న దెవరు ?" అని ప్రశ్నించాడు ధనికుడు. "అతడు నాపనివాడు, స్వామీ, కుట్టుపని బాగా చేస్తాడు" అని సుదర్శనం బదులు చెప్పినాడు. "జాగ్రత ! పడ్డాది మన్నేటట్లు తయారు చేయాలి జోడు—మీలో యెవడు చేస్తాడో మరి !" అని ప్రభాకరుణ్ణి కూడ హెచ్చరించాడు ధనికుడు. ప్రభాకరు డేమంటాడో అని సుదర్శనం ప్రభాకరునివంక చూచాడు. కాని ప్రభాకరుడు ధనికునివంకగాని, మరెవ్వరివంకగాని చూడటంలేదు. ధనికుని వెనుకనున్న చీకటిమూలవైపు పరీక్షపెట్టి చూస్తూన్నట్లు కని పించాడు. చూస్తూ చూస్తూ ప్రభాకరుడు నవ్వినాడు. ముఖం ప్రకాశమానంగా వెలిగింది.

"ఎవరిని చూచిరా, అట్లా పండ్లికిలిస్తావు ? బుద్ధిహీనుడా !

జోడు మాత్రం అనుకున్న దినానికి పూర్తి కావలె. ఆలస్యం కూడదు" అన్నాడు ధనికుడు. ప్రభాకరుడు మాట్లాడలేదు.

"చిత్తం, బాబూ, త్వరలోనే పని పూర్తి చేస్తాము" అని సుదర్శనమే జవాబిచ్చాడు. "సరే, జాగ్రత" అని చెపుతూ, ధనికుడు తాను విప్పిన పాదరక్ష, కోటు తిరిగి సేవకుని చేత తొడిగించుకొని, వెళ్ళిపోదామని వెనుక తిరిగాడు. గుమ్మంవద్ద తల వంచటం మరచిపోయినాడు. ద్వారపుకమ్మి తలకు కొట్టుకున్నది. చిరుముడిపడి, చేత తల తడుముకుంటూ బండిలో కెక్కి — ఇంటికి బయలుదేరినాడు.

తరువాత సుదర్శనం అన్నాడు: "చూచారా, మనిషంటే అతడు! తల తాకడంతో గుమ్మం కదిలి కిందపడ్డదేమో అనుకున్నాను. అతని తల కెక్కడా దెబ్బ తగిలినట్లు లేదు!" అది విని నళిని యిట్లన్నది: "ఔను, మరి — కావలసినంతవున్నవాడు; కనుకనే బలిసి పోతవిగ్రహం లాగున్నాడు. మృత్యువుకూడా అటువంటి పర్వతాన్ని చూచి భయపడి పారిపోతుంది!"

౭

కొంతసేపైన తరువాత సుదర్శనం ప్రభాకరునితో యిట్లన్నాడు: "ఏమోయి, తమ్ముడూ! పని తీరా ఒప్పుకున్నాము. చివరకు చివాట్లు రాకుండా జాగ్రతపడాలి. ధనికులతో యేది వచ్చినా ప్రమాదమే — బాధపడిపోతాము సుమా! చర్మం చాల విలువైనది; మనిషి చూస్తే ముక్కోపి. మన జాగ్ర

తలో మనం వుంటే మర్యాద దక్కుతుంది. నీవే చూడు, బాబూ! నీ దృష్టి సూక్ష్మమైనదే, నీ చెయ్యా ఆరితేరినదే. ఇదిగో చర్మాం, ఇదిగో కొలత—పని ప్రారంభం చెయ్యి."

సుదర్శనం కోరికపైని ప్రభాకరుడు పని ప్రారంభించాడు. చర్మాం బల్లమీద పరిచి, మధ్యకు మడతపెట్టి కత్తిరించడం మొదలుపెట్టినాడు. నలిని వచ్చి ప్రభాకరుని కత్తిరింపుచూస్తూ కూర్చున్నది. ఆ కత్తిరింపు పద్ధతి చూచేసరికి ఆమెకు ఆశ్చర్యాం తోచింది. అతడు కత్తిరించేది 'బూటు' కొరకు కాదు. ఎందుకో గుండ్రంగా మరొక కత్తిరింపు మొదలు పెట్టినాడు. "ఏమో, ఘరానా మనుష్యుల జోళ్లు ఎట్లా చేస్తారో నాకేం తెలుసును? ప్రభాకరునికంటె నా కెక్కువ తెలుస్తుందా? నా కెందు కీ తొందర?" అనుకొని ఊరుకున్నది. కత్తిరింపు కాగానే దారం ఒకటి పెనివేశాడు ప్రభాకరుడు. జంటకుట్టుకు బదులు ఒంటివరస కుట్టు ప్రారంభించాడు. నలిని ఆశ్చర్యాం అధికమయింది. పనియొక్క మొదలు తుద ఆమె కేమాత్రం అర్థం కాలేదు. "పోనీ, నా కెందుక"నుకొని మళ్ళీ మాట్లాడక కూరుకున్నది. మధ్యాహ్నమయింది, సుదర్శనం భోజనానికి లేస్తూ ప్రభాకరు డెంతవరకు పనిచేశాడో చూదామని దగ్గరకు వచ్చాడు. చర్మాంతో బూటు చేయడానికి మారుగా 'స్లిప్పర్లు' జత చేసి అక్కడ పెట్టినాడు ప్రభాకరుడు.

అది చూచేసరికి సుదర్శనం ప్రాణం ఎగిరిపోయింది. గుండె బాదుకుంటూ ఒక కేక పెట్టినాడు. "అయ్యయ్యో, ఏమిటిది!

సంవత్సరంనుంచి నాదగ్గర పనిచేస్తూ, ఎప్పుడూ ఒక్క పొరపాటైనా లేకుండా మంచిపనివాడనిపించుకున్నావే! ఎంతపని చేశావయ్యా! ఏమి నా దురదృష్టం! ఇప్పుడు చేయవలసిందేమిటి? విలువైన చర్మమంతా ధ్వంసమై పోయింది. ఆయన వచ్చి 'బూటు' యేదంటే ఏమని చెప్పను? తిరిగి ఇటువంటి చర్మం నా ఆస్తి అంతా అమ్మినా రాదే! ధనికుడు ఎటువంటి బూటు చేయమన్నాడో నీవు మాత్రం వినలేదా? అతడు చెప్పిపోయినదేమిటి—నీవు చేసిన పనేమిటి? చివరకు నన్ను చంపేశావు. ఈ అవాంతర మిప్పుడు తప్పడమెట్లా?" అని విలపించటం ప్రారంభించాడు.

సుదర్శన మిట్లా కంగారుపడుతూండగానే వాకిట్లో తలుపు గొళ్లెం చప్పుడయింది. ఒకతప్పుడే గుర్రందిగి గుర్రాన్ని బయట కట్టివేస్తున్నట్లు కిటికీలోనుంచి నలిని చూచి, వెంటనే వెళ్లి తలుపు తెరిచింది నిన్న ధనికునివెంట వచ్చిన సేవక బాలుడు లోపలికి వచ్చి, సుదర్శనాన్ని వందనపూర్వకంగా పలకరించాడు. సుదర్శనం తిరిగి వందనం చేస్తూ, "ఏమయ్యా ఇట్లా వచ్చావు?" అని కుర్రవాని నడిగాడు. "మా అమ్మగారు నన్నుపంపించారు" అని కుర్రవా డన్నాడు. "ఎందుకని?— ఏమంటావు?", అన్నాడు సుదర్శనం. "ఇక మా అయ్యగారికి బూటు అక్కర లేదు. ఆయన చనిపోయినారు" అన్నాడుసేవకుడు. "అయ్యో అదేమిటి!!" అని సుదర్శనం తెల్లబోయినాడు.

"మిమ్ము విడిచి వెళ్లిన తరువాత అయ్యగారు ఇంటికే చేర

లేదు; బండిలోనే చనిపోయినారు. బండి యింటికి చేరగానే, నౌకర్లందరూ కూడి శవాన్ని కిందికి దింపడము బహు కష్ట మయింది. ఇప్పుడు అమ్మగారు నన్నిక్కడికి కొక జరూరు పని మీద పంపినది. నిన్న పురమాయించిన బూటు అసలక్కర లేదట. శవానికి తొడగటానికి మెత్తని స్లిప్పర్ల జోడొకటి వెంటనే తయారుచేయించి పుచ్చుకొని ఇక్కడున్నట్లుగా నన్ను తిరిగి రమ్మన్నారు" అని సేవకు డన్నాడు.

సేవకు డీ మాట అంటూండగానే ప్రభాకరుడు లేచి వచ్చి, తాను చేసిన స్లిప్పర్లను గుడ్డతో శుభ్రంగా తుడిచి, జోడూ - చర్మంలో మిగిలిపోయిన ముక్కలూ కలిపి కట్టి, సేవకుని చేతిలో పెట్టినాడు. అవి పుచ్చుకొని సేవకుడు వందనం చేసి వెళ్లిపోయినాడు.

## ౮

ఇట్లా ప్రభాకరుడు సుదర్శనం యింటివద్ద చాలకాలం గడి పాడు. ఆరవ సంవత్సరం గడుస్తూవున్న దిప్పుడు. ఇంట్లో అడుగుపెట్టినది మొదలు ప్రభాకరుడు ఒకేరీతిగా కాలంగడుపు తున్నాడు. చెప్పిన పనులన్నీ అతిశ్రద్ధతోనూ, నేర్పుతోనూ నెరవేరుస్తూ, అందరి విశ్వాసానికీ గౌరవానికీ పాత్రుడైనాడు. ఇల్లు విడిచి బయటి కెక్కడికీ వెళ్లేవాడుకాడు. అవసరమైనపుడు ముక్తసరిగా ఒకటి రెండు మాటలు జవాబు చెప్పడం తప్ప అన్నివేళలా మౌనంగానే కూర్చునేవాడు. తా నక్కడవున్న

ఆ రెండేళ్లలోనూ లెక్క రెండుసార్లు చిరునవ్వు నవ్వినాడు—మొదటినాడు రాత్రి నలిని తన కన్నం పెట్టి ఆదరించినప్పు డొకసారి; తరువాత ధనికుడు జోడు పురమాయించడానికి వచ్చినప్పు డొకసారి. ప్రభాకరుని శ్రద్ధాభక్తులకూ, పనిలో కన బరచే బుద్ధి కుశలతకూ సుదర్శనం అపరిమితానందం పొందుతూ ప్రభాకరుని చూచుకొని గర్విస్తూవుండేవాడు. ఎక్కడనుంచి వచ్చావనిగాని, నీ జీవితవృత్తాంత మేమని గాని ప్రభాకరుణ్ణి అడగవలెననే ఆలోచనే విరమించుకున్నాడు. ఇంతటి సమర్థుడు, మంచివాడు ఎప్పుడైనా తన్ను విడిచి వెళ్ళిపోతాడేమో ననే భయం తప్ప సుదర్శనానికి మరివేరు దిగులులేదు.

ఒక రోజున మరొక విశేషం జరిగింది. అందరూ యింటి వద్దనే వున్నారు. నలిని వంట చేస్తున్నది. పిల్లలు ఆడుకుంటున్నారు. సుదర్శనం కిటికీపక్కను కూర్చుని కుట్టుపని చేస్తున్నాడు. ప్రభాకరుడు మరొక కిటికీవద్ద కూర్చుని జోడుమడమ దట్టిస్తున్నాడు. ఇంతట్లో సుదర్శనం కొడుకు కొకడు (పిల్లవాడు) బెంచి పొంబడే ప్రభాకరునివద్దకు పరుగెత్తివచ్చి, అతని భుజం మీాది కొరిగి కిటికీ బయటకు చూస్తూ ప్రభాకరునితో యిట్లన్నాడు: "చూడు, చూడు! అదిగో అట్లా చూడు! ఇద్దరు పిల్లలూ వాళ్లమ్మా వస్తున్నారు. ఇక్కడికేనా వస్తున్నారు? ఒక అమ్మాయి కుంటుతూన్నది, పాపం! చూడు, చూడు!" ప్రభాకరుడుకూడ కిటికీలోనుంచి వీధిలోకి చూచాడు. చేతిలో పని విడిచిపెట్టి ఇంతకుముం దెన్నడూ ప్రభాకరుడు బయటి

దృశ్యాలను చూచి యెరుగడు. ప్రభాకరుని దృష్టిని ఆకర్షించే టంత వింత విషయం బయట యేముందని సుదర్శనంకూడ బయటికి చూచాడు. శుభ్రమైన దుస్తులు ధరించి, ఇద్దరు ఆడ పిల్లలను వెంట దీసుకుని, ఒక స్త్రీ ఈ యింటివైపుకే వస్తు న్నది. పిల్లలిద్దరిపీ కూడ విలువైన దుస్తులే. వాళ్లు ఆమె చేయి పట్టుకొని చెరియొకవైపునా నడిచి వస్తున్నారు. అందులో ఒకపిల్ల ఎడమకాలితో కుంటడం తప్ప ఇద్దరిలో యెట్టిభేదమూ కనబడటంలేదు.

మరికొంచెం సేపట్లో స్త్రీ, పిల్లలూ గుమ్మంవద్దకు వచ్చి నిలిచారు. స్త్రీ తలుపు తెరిచి పిల్లలిద్దరినీ ముందు లోప లికి పంపుతూ "సుదినం, అయ్యలారా, సుదినం!" అంటూ పిల్లల వెనుకనే తానుకూడా లోపలికి వచ్చింది. "రండమ్మా, రండి. ఎందుకిట్లా వచ్చారు? మాకేదైనా పని యిస్తారా? అన్నాడు సుదర్శనం. స్త్రీ వచ్చి బల్లపక్కనే కూర్చున్నది. పిల్లలిద్దరూ ఆమె పక్కనే నిలబడ్డారు. "ఈ పిల్లలిద్దరికీ చెరి ఒక జోడూ కుట్టి యియ్యాలి" అన్నది స్త్రీ. "సరే. యిస్తా మమ్మా—ఏ రకం కావలెనో చెప్పండి. ఇదుగో మా ప్రభా కరుడు—ఆరితేరిన పనివాడు—మరేమీ సందేహ మక్కర లేదు" అన్నాడు సుదర్శనం.

ఇట్లా అంటూనే సుదర్శనం ప్రభాకరునివంక చూచాడు. ప్రభాకరుడు చేసే చేసే పని విడిచిపెట్టి, చిన్నబిడ్డ లిద్దరి వంకనూ రెప్పవేయక చూస్తూ కూర్చున్నాడు. పిల్లలు చూస్తే

చాలా ముగ్ధవస్తూన్న మాటనిజమే కాని ప్రభాకరుడు తానిది వర కెప్పుడో యెరిగివున్న వాళ్ళను చూచినట్లు వాళ్ల నంత శ్రద్ధతో చూడడానికి కారణమేమో సువర్ణనాని కింత మాత్రమూ అర్థంకాలేదు. ఒకవాక ఈవింత దృశ్యాన్నిట్లా చూస్తూనే సువర్ణనం బేరం కుదుర్చుకొని, పిల్లల పాదాల కొలతలు తీసుకోవడం ప్రారంభించాడు. స్త్రీ కుంటిపిల్లను యెత్తుకొని సువర్ణనంతో యిట్లా అన్నది: "ఈబిడ్డకు రెండు కొలతలు తీసుకోవలె. కుంటికాలికి ఒక పాదరక్ష, మంచి కాలికి మూడు, తయారుచేస్తే ఇద్దరికి సరిపోతాయి. ఇద్దరిదీ ఒకటే కొలత. వీళ్లు కవలపిల్లలు." ఆమె చెప్పిన ప్రకారం సువర్ణనం కొలతలు తీసుకొని, "అయ్యో, పాపం! ఈ బిడ్డకీ కుంటితన మెట్లా సంభవించిందమ్మా? పుట్టుకలోనేవున్నదా? ఎంత చక్కని బిడ్డ!" అన్నాడు. "లేదు, లేదు. ఆమె తల్లివల్లనే యీ ప్రమాదం జరిగింది" అని స్త్రీ జవాబిచ్చింది. ఈ మాట మీద నలినికూడ కల్పించుకొని మాట్లాడటం ప్రారంభించింది. అయితే ఈ బిడ్డలను వెంటదీసుకొనివచ్చిన స్త్రీ యెవరనే అనుమానం కలిగిందామెకు. "ఈపిల్లల తల్లివి నీవు కాదా అమ్మా?" అని ప్రశ్నించింది నలిని. "కాదు—నేను వీళ్ళ తల్లిని కాను, చుట్టాన్ని కాను. నేనువీళ్లను పెంచుతున్నాను" అని స్త్రీ జవాబు చెప్పింది, "నీవు కన్నబిడ్డలు కాకపోతే వీళ్ల మీద నీ కింత ప్రేమ యెట్లా కలిగింది?" అని తిరిగి ప్రశ్నించింది నలిని. "అయ్యో, ప్రేమించకపోతే యెట్లా? వీళ్లను

పాలిచ్చి పెంచింది నేనే. నాకూ ఒక బిడ్డ వుండేది. కాని ఆ బిడ్డను చిన్నప్పుడే భగవంతుడు తీసుకొనిపోయినాడు. నాకిప్పుడీ బిడ్డలమీద వున్నంత ప్రేమ నాబిడ్డమీదకూడా వుండేది కాదు" అని స్త్రీ జవాబిచ్చింది. "అయితే వీళ్లెవరిబిడ్డలంటావు?" అని నలిని మరొక ప్రశ్న అడిగింది.

౯

అప్పుడాబిడ్డల వృత్తాంతం స్త్రీ యిట్లా చెప్పడం ప్రారంభించింది: "వీళ్ళ తల్లిదండ్రులు చనిపోయి ఆరు సంవత్సరాలయింది. ఇద్దరూ ఒక్కవారంలో పోయినారు. ఈ బాలికలిద్దరూ తండ్రిపోయిన మూడవ దినాన్ని జన్మించారు. తల్లి పూర్తిగా ఒక్కదినమైనా వాళ్ళను చూచుకోలేదు. నేనూ, నాభర్తా అప్పుడావూళ్ళోనే కాపురముండేవాళ్ళం. ఈపిల్లల తండ్రి కట్టెలమ్ముకొని కుటుంబపోషణ చేసుకునేవాడు. ఒక నాడు చెట్టు కొడుతూండగా కొమ్మ ఒకటి విరిగి మీదపడ్డది. ఇంటికి తీసుకొని రాక ముందే, దారిలోనే అతడు చనిపోయినాడు. ఆ మూడవ దినాన్నే ఈబిడ్డల జననం. తల్లికి దిక్కులేనితనం—ఇంట్లో కటిక దారిద్ర్యం. దగ్గరకు వచ్చి పలకరించే మనిషికూడా లేకపోయినారు. ఒంటరికత్తెగా ప్రసవించింది—ఏకాకిగా మరణించింది.

"మరునాడుదయం నే నామెను చూడబోయినాను. లోపలికి పోతినికదా, ప్రాణం పోయిన కట్టె కనిపించింది. మరణ

వేదనలో ఒళ్ళెరుగకుండా బిడ్డమీదికి దొర్లటంలో ఆబిడ్డకాలు వంకర పోయింది. కొంతసేపటికి పొరుగువాళ్ళందరూ పోగు పడ్డారు. శవాన్ని తీసుకొనిపోయి భూస్థాపన చేశారు. పాపం, ఆ బిడ్డల గతి—ఇక చెప్పేదేమున్నది! అప్పుడా దిక్కుమాలిన కూనల నేమి చేయువలె! అక్కడ చంటిబిడ్డ వున్నదాన్ను నే నొక్కతెనే, నాబిడ్డ పుట్టి అప్పటికి రెండు నెలలయింది. ఈ అనాథ శిశువులను కూడా నేనే చేరదీసి నా బిడ్డతోపాటు పెంచాను. మంచి తిండి తిని పుష్టిగా వుండేవాన్నేమో, భగవంతుని దయవల్ల పిల్లలు ముగ్గురికీ సరిపోయేవి పాలు. భగవత్కటాక్షంవల్ల వీళ్ళిద్దరూ పెరిగి యిప్పటి కిట్లావున్నారు. నే కన్నబిడ్డ రెండేళ్లు నిండకుండానే చనిపోయినాడు. తరువాత మళ్ళీ నాకు సంతానం కలగనేలేదు. నాభర్త యిప్పుడొక వర్తకునివద్ద పనిచేస్తున్నాడు. కొదవలేకుండా కుటుంబ పోషణ జరుగుతూనే వున్నది. కాని ఈ పిల్లలను విడిచి పెడితే మా కిక ప్రేమాస్పదమైన వస్తువేది? ప్రేమ లేకపోతే బ్రతకడ మెట్లా? జీవితాని కానంద మిచ్చి, నన్ను బ్రతికించేది వీళ్ళే— నిజంగా నమ్మండి."

ఇట్లా చెపుతూ స్త్రీ తన ఒడిలోవున్న కుంటిపిల్లను ఒక చేతితో తన గుండె కదుముకుంటూ, తన చెక్కిలి మీదికి కారుతూన్న కన్నీటి బిందువును రెండవ చేతితో తుడుచుకున్నది.

నలిని ఈ కథంతా అతిశ్రద్ధతో ఆలకించి, కథ ముగియగానే ఒక్క నిట్టూర్పు విడిచి యిట్లన్నది: "కన్నతలిదండ్రులు

లేకపోయినా బ్రతకవచ్చునే గాని భగవంతుని విడిచి మాత్రం బ్రతకలేమనే సామెతలో ఎంతైనా సత్యమున్నది!'' నలిని ఈ మాట అంటూవుండగానే మెరుపుతీగ వెలిగినట్లు ఒక్కసారి యిల్లంతా అద్భుతంగా ప్రకాశమానమయింది. ఆ వెలుతురు ప్రభాకరుడు కూర్చున్న మూలనుంచే వస్తూన్నట్లగపడ్డది. అందరి దృష్టి దానంతట అదే ప్రభాకరునిమీదికి తిరిగింది. అతడక్కడనే యెప్పటి రీతినే కూర్చున్నాడు. మోకాళ్లపైన చేతులు ముణిచి కూర్చుని, ఊర్ధ్వముఖంగా చూస్తూ చిరునవ్వు నవ్వుతున్నాడు.

## ౧౦

స్త్రీ తన పిల్లలను వెంటబెట్టుకొని వెళ్లిపోయింది ఆమె వెళ్ళిన వెంటనే ప్రభాకరుడు తాను చేస్తున్నపని ఉన్నదున్నట్లు విడిచిపెట్టి లేచాడు. చొక్కాపైన కట్టుకున్న మాపుగుడ్డ విప్పి కింద పడవేశాడు. సుదర్శనానికీ నలినికీ సాగిలపడి నమస్కరించి యిట్లన్నాడు: ''ఓ నాయజమానులారా, తల్లిదండ్రులారా! ఇక నాకు సెలవియ్యండి. భగవంతుడు నా కిప్పటికి క్షమాపణ యిచ్చాడు. మీరు కూడ నన్ను క్షమిస్తారని నా ప్రార్థన—మీయెడలనూ నే జేసిన అపరాధా లుండవచ్చు.

భార్యాభర్త లిద్దరూ ఆశ్చర్యనిమగ్నులై తెరిచిన కన్ను మూయకుండా ప్రభాకరునివంక చూడటం ప్రారంభించారు ప్రభాకరునిముఖం జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నది. సుద

క్షసం దగ్గరకు వచ్చి, ప్రభాకరుని కాళ్ళకు సాష్టాంగపడి యి ట్లన్నాడు: "అయ్యా, నీవు మానవమాత్రుడుగా కనిపించడం లేదు. నీ యిష్టం లేనిదే నిన్ను నేనిక్కడ వుంచుకోనూలేను; ఎందుకు వెళ్ళిపోతావని నిన్ను ప్రశ్నించనూలేను. నాయనా, ఒక్క సంగతి మాత్రం దయచేసి నాకు తెలియజెపుతావని నా ప్రార్థన. ఆనాడు దేవాలయంవద్ద కనబడినప్పుడు నీ వంత దిగులుజెంది వున్నదానికీ, ఆరాత్రి మనం యింటివద్ద భోజనం చేస్తూండగా నీవు చిరునవ్వు నవ్వినదానికి కారణమేమి? తరువాత ధనికుడు మన యింటికి వచ్చినప్పుడు అంతకంటెనూ ఆనందపరవశుడవై నవ్వినదానికీ ఇప్పుడీ స్త్రీ బిడ్డలను వెంట బెట్టుకొని రాగా తిరిగి—ఇది మూడవసారి నవ్వినదానికీ కారణమేమి? మహానుభావా, ఎందుకు నీ ముఖమంత దీప్తివంతంగా వెలుగుతున్నదయ్యా? నీ కిష్టముంటే దీని కంతకూ కారణం చెప్పి నన్ను కృతార్థుణ్ణి చేయవా, నాయనా?"

ప్రభాకరు డిట్లా జవాబు చెప్పినాడు: "మీకు కనిపించినది దివ్యతేజస్సు. దానికి కారణమిది. నేనొకప్పుడు కఠిన శిక్షకు బద్ధుణ్ణయి బాధ ననుభవించాను. భగవంతు డిప్పటికి నాకు ముక్తి నిచ్చాడు. నేను నవ్విన మూడుసార్లూ మూడు సత్యాలు నాకు భగవంతుని దయవల్ల గోచరించాయి. నీభార్య నన్ను చూచి జాలిచెందినప్పుడే నేను మొదటి పాఠం నేర్చుకున్నాను. ధనికుడు మీయింటికి వచ్చిన సందర్భంలో రెండవ

పాఠం. స్త్రీ పిల్లలను వెంటబెట్టుకొని వచ్చినప్పుడు మూడవ పాఠం నాకు బోధపడ్డవి."

అప్పుడు సుదర్శన మన్నాడు: "అయ్యా భగవంతుడు నిన్నెందుకు శిక్షించాడో, నీవు నేర్చుకున్న మూడు పాఠాలేవో దయచేసి మాకు కూడ చెప్పవా? అమూల్యమైన నీ యనుభవాలు యీ దీనుల కెంతైనా ఉపకరిస్తాయి."

దానికి ప్రభాకరు డిట్లా జవా బిచ్చాడు: "భగవంతుని యెడల అవిధేయత జూపినందుకే నాకీ శిక్ష విధింపబడ్డది. ముందు స్వర్గలోకంలో నే నొక దేవదూతనై యుండి, భగవంతుని ఆజ్ఞ నుల్లంఘించి పతితుణ్ణయినాను. ఒక స్త్రీ యొక్క ఆత్మను తీసుకొని రమ్మని ఒకసారి భగవంతుడు నన్ను పంపగా, భూలోకాని కెగిరివచ్చాను. అప్పుడే ప్రసవించి కవల పిల్లలను కని, రోగపీడితురాలై పడివున్న ఒక తల్లిని చూచాను. ఆ పసికూనలు తల్లి పక్కలో మిలమిల కదలుతూ వుండటం, పిల్లలను దగ్గరకైనా తీసుకోలేని తల్లియొక్క నిస్సత్తువ చూచాను. ఆమె నన్ను చూచి, నేను తనకొరకే వచ్చానని యెరిగి, యేడుస్తూ యిట్లన్నది: "దేవా, చెట్టు విరిగి మీదబడి నిన్న గాక మొన్న నే నాభర్త చనిపోయినాడు. నాయనా, నాకు తల్లి గాని, అప్పచెల్లెళ్లుగాని, పినతల్లిగాని యెవ్వరూ లేరు. అయ్యా, నా బిడ్డలను కొంతకాలమైనా పెంచి పెద్దవాళ్లను చేసుకొనేవరకూ నన్నీలోకంలో నుండనియ్యరా, తండ్రీ? తరవాత నన్నక్కడికి తీసుకొనిపోయినా సరే— తల్లిదండ్రి

లిద్దరూ లేకపోతే పసిబిడ్డల బ్రతుకు కెట్లా ?" ఆమెయొక్క దీనాలాపం విని జాలిపడి, ఒక బిడ్డ నెత్తి తల్లి రొమ్మువద్దకు చేర్చి, రెండవ బిడ్డను తీసి ఆమె చేతి కందిచ్చి, తిరిగి స్వర్గలోకానికి పోయినాను. పోయి భగవంతునితో యిట్లన్నాను: 'ఆ తల్లియొక్క ఆత్మను నేను తీసుకొని రాజాలకపోతిని. ఆమె దుస్థితి చూచి నా చేతు లాడలేదు. భర్త మొన్ననే చనిపోయినాడట. ఆమె యిప్పుడే ప్రసవించి, దిక్కులేక, రోగంతో పడివున్నది. 'నాయనా నన్నిప్పట్లో నా బిడ్డలనుండి వేరు చేయకండి! దిక్కులేని యీ కూనలకొరకైనా నన్ను రక్షించండి! తల్లిదండ్రులు లేక బిడ్డ లెట్లా బ్రతుకుతారు ?" అని యెంతో దీనంగా మొరబెట్టుకున్నది. అందుచేత నేను తిరిగి వచ్చేశాను.' అప్పుడు భగవంతు డన్నాడు: 'అట్లా కాదు; తిరిగి వెళ్లు! ఆమె జీవాన్ని నీ విప్పుడే తెచ్చి తీరవలె—తప్పదు. తెచ్చి, అటుపైన నీవు మూడు సత్యాలు తెలుసుకోవలసివున్నావు. మానవునిలో వున్న గొప్ప వస్తు వేదో తెలుసుకోవలె—ఇది మొదటి సత్యం. మనుష్యుని కియ్యబడని వస్తువు (తెలివి) యేదో తెలుసుకొనడం రెండవది. మనుష్యుని బ్రతుకు కల్లా ముఖ్యాధారం యేదో నీవు తెలుసుకో! ఇది మూడవది. ఈమూడూ స్పష్టంగా బోధపరుచుకున్నప్పుడు గాని తిరిగి స్వర్గంలో నీకు స్థానం లేదు.' వెంటనే నేను తిరిగి భూలోకాని కెగిరి వచ్చి ఆమె ప్రాణాన్ని తీసుకున్నాను. తల్లి మరణవేదనలో పక్కకొత్తిగిలడంతో ఒక బిడ్డ కాలు నలిగి వంకరయింది. స్త్రీ

ప్రాణాన్ని స్వర్గానికి చేర్చుదామని పై కెగిరినాను. ఒక విపరీతపు గాలి కొట్టి నన్ను కిందికి త్రోసివేసింది. స్త్రీ యొక్క ఆత్మ మాత్రం ఒంటరిగా స్వర్గానికి చేరింది. నా పాపం కొద్దీ నే నొక రోడ్డుపక్కను పడ్డాను.’’



ఆరు సంవత్సరాలకు పూర్వం తమ యింట ఆతిథ్యంపొంది, అప్పటినుంచీ తమతోపాటు జీవితం గడిపి, గృహపావనం చేసిన ఈ ఆత్మబంధువు యెవరో నలిని, సుశర్మనం ఇప్పటికి స్పష్టంగా తెలుసుకోగలిగినారు. భార్యాభర్త లిద్దరూ భక్తిపారవశ్యంలో బడి ఆనందబాష్పాలు విడిచారు.

అప్పు డా దివ్యపురుషు డి ట్లన్నాడు: ‘‘మానవునికుండే ఆవశ్యకతలు గాని, చలి గాని, ఆకలిదప్పులు గాని మనుష్య రూపం దాల్చేవరకూ నా కేమీ తెలియలేదు. కాని ఆరోజున మైదానంమీద తిరుగుతూ నేను పడ్డ బాధకు మితిలేదు. దగ్గరలో ఒక గుడి కనిపించింది. దగ్గరకు పోయి చూడగా, తలుపు తాళం వేసివుంది. కనుక గోడ వెనుకకు చేరి కూర్చున్నాను. సాయంకాలమయింది. చలి బాధ, ఆకలి బాధ ఒకదానినొకటి మించిపోయింది. చేత కర్ర బట్టుకొని తనలోతాను మాట్లాడుకుంటూ ఒక వ్యక్తి రోడ్డుమీద పోతూన్నట్లు కనిపించింది. నేను మానవరూప మెత్తిన తరువాత మొదట కనిపించిన

మనుష్యుడతడే. చూడగానే అతని వైఖరి నాకతి భయంకరంగా కనబడ్డది. తానూ, తన భార్యా బిడ్డలూ ఎట్లా బ్రతుకడమా అని తనలో తానే గొణుగుకుంటూ పోతున్నాడు. అప్పుడు నే ననుకున్నాను: 'నే నిట్లా ఎగరుగా చలితోనూ ఆకలితోనూ చస్తున్నానే! నాబాధను కొంచెమైనా చూడకుండా ఈ మానవుడు తన భార్యాబిడ్డలకూ తనకూ కూడుగుడ్డలెట్లా వస్తాయనే స్వార్థచింతలో మునిగిపోతున్నాడు! ఇతడింక నాకేం సహాయపడతాడు!' అని నే ననుకున్నట్లుగానే అతడు దగ్గరకు వచ్చి, చికుముడిపడుతూ నన్ను నవ్యాంచుకొని వెళ్లి పోయినాడు. దానితో నా మనస్సు తల్లడిల్లిపోయింది. నేనతని ముఖం బొత్తిగా చూడలేకపోయినాను. కాని అతడు తనంతట తానే వెనకకు మరలి, తిరిగి నావద్దకే వచ్చి నిలిచాడు. తల యెత్తి చూచాను. అప్పటికప్పుడే అతని ముఖవిన్యాసాలన్నీ మార్పుచెందినాయి. కొన్ని నిమిషాలకుపూర్వం అతనిముఖంలో మృత్యుదేవత తాండవమాడటం చూచాను. ఇంతట్లోనే, అతడు తిరిగి వచ్చేసరికి, భగవంతుని అమృత స్వభావం హృదయంలో అంకురించి, ఆ ముఖంలో ప్రత్యక్షమయింది. అమిత ఆత్మతతో నా పక్కకు చేరి, నన్ను లేవదీసి, గుడ్డలు కట్టబెట్టి, వెంటబెట్టుకొని యింటికి తీసుకొనిపోయినాడు. ఇల్లు చేరగానే ఒక స్త్రీ వచ్చి మాట్లాడటం మొదలుపెట్టింది. నేను మొదట చూచిన ముఖంకంటెనూ ఆమె ముఖం వెయ్యిరెట్లెక్కువభయంకరంగా వుంది. ఆ ముఖంలోనుంచి మృత్యువే నిప్పులు గక్కుతూ

బయటికి వచ్చింది. ఆ యింట్లో నా కప్పుడు ఊపిరే ఆడలేదు. నన్ను తిరిగి బయటికి తరిమివేదామనుకున్నదామె. కాని ఈ స్థితిలో ఆమె భర్త అడ్డుపడి ఆమె మానాన్ని కాపాడినాడు; భగవంతుని దయాగుణాన్ని గూర్చి ఆమెకు నచ్చచెప్పినాడు. కొంతసేపటికామె హృదయం మారి, తిరిగి సజీవురాలయింది. వెంటనే అన్నం తెచ్చి నా ఆకలి దీర్చింది. ఆమె ముఖ మప్పటికి పూర్తిగా మార్పుజెందింది, మృత్యువు పరాజయం పొందింది, ముఖంలో జీవకళ ప్రవేశించింది. అప్పుడామెలో నాకు భగవద్దర్శనమయింది. భగవానుడు నియమించిన మొదటి పాఠం నా కప్పుడే అవగాహనయింది. 'మానవునిలో వున్న ఉత్కృష్ట వస్తువేది?' ఆ వస్తువే 'దయ'; దయ తప్ప మరొకటి కానేరదని నేను తెలుసుకున్నాను. అప్పుడు నాకు కలిగిన ఆనందమే నేను మొదటిసారి నవ్వినదానికి కారణం.

"అట్లా మీతో కాలక్షేపం చేస్తూ వచ్చాను. ఒక సంవత్సరం గడిచింది. ధనికుడొకడు ఒకనాడు వచ్చి బూటుచేయమన్నాడు. జోడు ఆకారం చెడకూడదని, సంవత్సరంవరకూ మన్నేటట్లుండాలని మరొకటికూడా విధించాడు. అప్పుడే నేను కన్నెత్తి చూచాను. ధనికుని వెనుకనే మృత్యుదేవత ప్రత్యక్షంగా కనిపించింది. ఆ సాయంకాలం లోగానే మృత్యువు ధనికుని ప్రాణాన్ని తీసుకొనిపోతుందని నాకు పొడగట్టింది. అప్పుడు నాలో నేననుకున్నాను: "ఈసాయంకాలమే తన ప్రాణం పోనున్నదని ఈ మనిషికి తెలియడంలేదు. సంవత్సరం

వరకూ మన్నే జోడు చేయమని పురమాయిస్తున్నాడు!" వెంటనే నాకు జ్ఞప్తికి వచ్చింది—నాకు నియమింపబడ్డ రెండవ పాఠం: 'మనుష్యుని కియ్యబడని వస్తువేది?' తన ప్రత్యేక అవసరాలేవో, తన కెప్పటి కేది తటస్థిస్తుందో తెలుసుకోగలిగే శక్తి మనుష్యునికి లేదు. ఈ విషయంకూడ నాకు తెలిసినందుకు నే నానందభరితుణ్ణయినాను. అప్పుడే నేను రెండవసారి నవ్వినాను.

"ఇక మూడవపాఠ మొక టుండిపోయింది—'మనుష్యుని బ్రతికించే వస్తువేది?' మీ యింట్లోనే వుంటూ, ఈ మూడవ పాఠం నేర్చుకునే దెప్పుడని పరితపిస్తూ, ప్రార్థిస్తూ వుండేవాణ్ణి. అట్లా తరువాత పదేళ్లు గడిచాయి. ఇద్దరనాథబాలికలను వెంటదీసుకొని ఒక స్త్రీ వచ్చింది. వెంటనే ఆ పిల్లలను గుర్తుపట్టగలిగాను. స్త్రీ చెప్పిన కథంతా విని, వాళ్ల జీవితాలెట్లా రక్షింపబడి అభివృద్ధిచెందినాయో తెలుసుకున్నాను. అప్పుడనుకున్నాను: 'వెనుక ఈ పిల్లలతల్లి వీళ్ళకోసమే కదా నన్ను బతిమాలుకొన్నది! తల్లిదండ్రులు లేక బిడ్డ లెట్లా బ్రతుకుతారన్నది! ఆమె దీనాలాపం విని, అదే సత్యం కాబోలు ననుకున్నాను. కాని చివర కేమయింది? మరొక స్త్రీ వచ్చి తల్లి చావు పిల్లలను కాపాడి, పెంచి పెద్దవాళ్లను చేసింది!' పరాయి స్త్రీ ఆ బిడ్డలయెడల అంత అవ్యాజప్రేమ నెప్పుడు చూపగలిగిందో అప్పుడే జీవవంతుడైన పరమేశ్వరుడు ఆమెలో నాకు దర్శన మిచ్చాడు. మనుష్యుని నిజంగా బ్రతికించే వస్తువేదో

నా తప్పులు స్పష్టంగా బోధపడ్డది. ఈ మూడు పాఠాలూ నేర్చుకొనడంతో నా పాపమంతా నశించి, నేను క్షమింప బడ్డాను. అప్పుడే నేను మూడవసారి నవ్వినాను.

# ౧౨

తరువాత ప్రభాకరుని శరీరం అంతర్ధానమై బగ బగ మండే ఒక జ్వాలగా పరిణమించింది. కాని దానిలోనుంచి మరింత గంభీరమైన కంఠధ్వని, ఒక దివ్యవాణిగా బయలుదేరి యిట్లా వినిపించింది: “మానవుడు బ్రతికేది ప్రేమను సాధించడంచేత గాని, ఎవనికి వాడు తనకొరకు పడే తాపత్రయం వలన కాదని నేను తెలుసుకున్నాను. మనుష్యుణ్ణయి వున్నప్పుడు నేను బ్రతకగలిగింది దేనివల్ల? నన్నుగూర్చి నేను తీసుకున్న జాగ్రతవల్లనా? కాదు, యేమాత్రమూ కాదు. ఒక మార్గస్థుని దయవల్ల; ఇంటివద్ద అతనిభార్య చూపిన జాలివల్ల. బాలికల నిద్దరినీ బ్రతికించినది తల్లియొక్క తాపత్రయమా?— కాదు. జాలితో వాళ్లను ప్రేమించిన పరాయి స్త్రీ హృదయంలో నిండిన ప్రేమయే. ఎవరి సుఖాన్నిగూర్చి వారు తీవ్రంగా ఆలోచన చేసి పనిచేయటంవలనకాదు. మనుష్యులు జీవిత సుఖాన్ని అనుభవించగలిగేది. మానవ హృదయంలో ప్రేమ అనే అమూల్యవస్తువు సుస్థిరంగా వుండి వున్నది కనుక నే.”

"మనుష్యులు ఎవరిమట్టుకు వారు విడివడి బ్రతకటం దేవు డొప్పుకోడు. అందుచేతనే యేవ్యక్తి మట్టు కావ్యక్తికి ప్రత్యే కంగా ఏ సమయానికే వస్తువు అవసరమౌతుందో తెలియ నీయడు. ప్రపంచంలో యే మనిషికి గాని సాయంకాలమయ్యే సరికి తనకు 'బూటు' కావలసివస్తుందో, లేక తన శవానికి స్లిప్పర్లే కావలసివస్తాయో తెలుసుకోలేడు. అట్లుగాక అందరూ కలిసి యేకకుటుంబంగా బ్రతకడమే ఈశ్వరుని పవిత్రేచ్ఛ. కను కనే సమిష్టిమీద సర్వత్ర అత్యావశ్యకమైన జీవితశరణ్యమేదో, దాన్నిమాత్రం ప్రతి ఒక్కడూ తెలుసుకోగలిగిన శక్తినిచ్చాడు. ఈ సూత్రాన్నిబట్టే ఇప్పుడు నాకు సమస్తం తెలిసింది. తమను గూర్చి తాము పడే ప్రయాసచేతనే బ్రతుకగలుగుతున్నామని మనుష్యు లనుకొన్నా అది సరికాదు. మానవులందరినీ ఒక్క విశ్వకుటుంబంగా బంధించగల ప్రేమసూత్ర మొక్కటే నిజ మైన బ్రతుకు దెరువు. ఎవనిలో ప్రేమ వుంటుందో పరమేశ్వ రునియందే అట్టివాని నివాసం. వాని హృదయమే భగవంతుని నివాసగృహంకూడా. ఎందుచేతననగా భగవంతుడంటేనే ప్రేమ కనుక."

గంభీరమైన ఈ యుపదేశమిచ్చి, చివరకా దివ్యవాణి భగవ త్ప్రార్థనగా, దేవతాగానంగా మారింది. ఆ గానంతో అక్కడ నున్న అందరి హృదయాలు పులకరించాయి. అక్కడి వస్తుసము దాయమంతా, సుదర్శనం కాపురమున్న యిల్లుకూడా కదలి వణకడం ప్రారంభించింది. ధగధగ మండుతూన్న ఆ దివ్యజ్వాల

మెల్లమెల్లగా పైకి లేచి, ఆకాశమార్గాన్ని ఎగసిపోయింది. అక్కడి మనుష్యు లందరూ కొంతసేపు స్మృతితప్పి మూర్ఛిల్లి నట్లయినారు. కొంతసేపటికి అందరూ తెలివి తెచ్చుకొని చూచేటప్పటికి తిరిగి యథాప్రకారంగా ఎక్కడి వస్తువులక్కడే పడివున్నాయి. మరి ప్రభాకరు డెక్కడ కనిపించలేదు.

---

మాలతీ ప్రెస్, నిడదవోలు.



పుస్తకాలు కావలసినవారు

యీ క్రింది విలాసమునకు వ్రాయవలెను :

తెల్లాప్రగడ ప్రకాశరాయుడు,

నిడదవోలు.

పశ్చిమ గోదావరి.

